# అభినవసరస్వతి

[ మాసపత్రిక ]

నాగరఖండ స్వర్ణకారవ్యవహారాది బహుగ్రంథకర్తయగు
జానపాటి పట్టాభిరామశాస్త్రిచే
ప్రచురింపఁబడుచున్నది.

గుంటూరు.

సంపుటము 33 { 1942 సం॥ జనవరి నెల 15వ తేది } సంచిక 10

## విషయములు.






చందానిర్ణయము సంవత్సరమునకు

| | | | |
|---|---|---|---|
| ప్రభావపోషకులకు | రు 25 0 0 | సహాయులకు | రు 5 0 0 |
| పోషకులకు | 10 0 0 | చందాదారులకు | రు 3 0 0 |

Printed at the Chandrika Press, Guntur,
and published at Guntur by the Editor, Astavadhani
Janapati Pattabhirama Sastry,
author of Nagarakhandam, Swarnakaravyavaharam
etc., etc.

# రాజపోషకులు.

శ్రీమంతు, రాణి ఆదిలక్ష్మీదేవమ్మ బహాదరుగారు,
గద్వాలసంస్థానము.

## ప్రధానపోషకులు.

౧ శ్రీ శ్రీ జగద్గురు, అభినవోద్దండ విద్యాశంకరభారతీ స్వాములవారు, పుష్పగిరి

౨ తంగెడ నరసింహారావుగారు, కరణము, మోర్జంపాడు.

3 ఆర్. రామారెడ్డిగారు, దైవముదిన్నె.

౪ రాజా సురభి వెంకటరత్నాంబ బహాదరుగారు, రాణీ, ఆఫ్ జటప్రోలు, కొల్లాపురము.

౫ శ్రీశ్రీ లక్ష్మీనరసింహస్వామివారు, యాదగిరి.

౬ రాజా రఘునందనసింగుగారు, నెల్లుట్ల.

౭ శ్రీ శ్రీ జగద్గురు సచ్చిదానందాభినవశంకర భారతీస్వాములవారు, హంపి.

౮ లింగాల రంగారెడ్డి దేశముఖుగారు, గణపురము.

౯ రామచంద్రారెడ్డి దేశముఖుగారు, ఇమనూరు.

## పోషకులు.

౧ జాగర్లమూడి కుప్పుస్వామినాయుడుగారు, కారంచేడు.

౨ రాజా కందుకూరు బాలసూర్యప్రసాదరావు బహద్దరు జమీందారుగారు - దివిడ

3 కాండ్రి వెంకటకృష్ణారెడ్డి దేశముఖుగారు, బనవాపురము.

## —: చందాదారులు :—

1 జానపాటి రత్నయ్యగారు. గట్టుతుమ్మెన
2 చింతలపాటి సుబ్బారావుగారు. ఆయిల్ కంపెని. సికింద్రాబాదు
3 సోమరాజు పరాంకుశరావు దేశపాండ్యాగారు. మేడిపల్లి
4 శీలం అలవాలరెడ్డిగారు. పోలేపల్లి
5 వైద్య రామశర్మగారు. మల్లేపల్లి
6 బుద్వేలు వెంకట్రావుగారు. జిల్లావేమ్కూరు, నల్లగొండ
7 లింగాల వెంకటరెడ్డి దేశముఖుగారు. కుందవరము
8 కొత్వాలి కిషన్ రావు దేశముఖుగారు. ఉప్పరపల్లి
9 ఏలూరు మాణిక్యరావుగారు గవిచెర్ల
10 ద్రోణా సోమయ్యగారు. సర్వవరము
11 నారపరాజు రాఘవరావు దేశపాండ్యాగారు. కందిబండ
12 కంచిరాజు రామకృష్ణారావుగారు. పట్వారి మల్లారెడ్డిగూడెము
13 వెలమకన్ని లక్ష్మీనారాయణశాస్త్రిగారు. శోభనాద్రిగూడెము
14 తంగెడ వెంకటనారాయణరావుగారు. కరణం. తంగెడ
15 చింతలపాటి రామమూర్తిశాస్త్రిగారు. గుడివాడ
16 తిరుక్కోవల్లూరు చక్రపాణిగారు. రిక్రూటింగాఫీసరు. గుంటూరు
17 వంగపల్లి నీలకంఠముగారు నిజాంరాష్ట్రసనాతనధర్మసభా కార్యదర్శి.
సికింద్రాబాదు
18 గుదిమెళ్ళ రామానుజాచార్యులుగారు ముక్తిపల్యగ్రహారము
19 ఆర్. పుట్టప్పగారు. హెడ్ క్యాషియర్,
ఇంపీరియల్ బ్యాంకి ఆఫీసు, ఆదోని.
19 (ఎ) వెంకటరామిరెడ్డిగారు పార్లపల్లి
20 బలుసు బుచ్చిసర్వారాయుడుబహదరు జమీందారుగారు.
కపిలేశ్వరపురము
21 గొడుగుల నారాయణమూర్తిగారు. కొప్పర్తి
22 పిసుపాటి సీతారామయ్యగారు. ఇంకొల్లు
23 వ్యాకరణము వెంకటేశ్వరసిద్ధాంతిగారు. గుంటూరు
24 పెద్దిభట్ల వీరయ్య బి. యే. బి. యల్ గారు. బెజవాడ
25 భాగవతుల వెంకటరామశర్మగారు. కొల్లూరు
26 తాడేపల్లి రాఘవనారాయణశాస్త్రిగారు. చందోలు
27 చెరుకుపల్లి నరసింహశాస్త్రిగారు. వలివేరు

28 వఝ్ఝం భోగప్పశాస్త్రిగారు. రిటైర్డుడిప్టీకలెక్టరు, గుంటూరు
29 సోమిని కామేశ్వరరావుగారు. అడ్వకేటు. రాజమండ్రి
30 అద్దంకి సింగరాచార్యులయ్యవార్లంగారు. తక్కెళ్ళపాడు
31 తిరుమలరావుగారు. పట్వారి. దేమె
32 నరసింగరావు దేశాయిగారు. లింగన్నపేట
33 ఉప్పల రంగారావు దేశపాండ్యాగారు. తాడూరు
34 తూరుపు మెట్టయ్యగారు. సిద్దిపేట
35 నరసారెడ్డి మొకద్దంగారు. నాచారము
36 గూడ వెంకటరామారెడ్డి దేశముఖుగారు. ఇటికాలపల్లె
37 తాండ్రి రాజారెడ్డి దేశముఖుగారు. అంకిరెడ్డిపల్లె
38 మరుకూరు నారాయణశాస్త్రిగారు. పాండురంగాశ్రమము
39 టేకులపల్లి కృష్ణారెడ్డిగారు. కేశవాపురము
40 నీలా నరసయ్యగారు మర్చెంటు సికింద్రాబాదు
41 జాలా వెంకటరామారావు దేశముఖుగారు. సింగారము
42 సీతారామారావు దేశముఖుగారు. జాలిగామ
43 రాయప్రోలు సుబ్బారావుగారు. ప్రొఫెసరు, యూనివర్సిటికాలేజి
హైదరాబాదు
44 యస్. వి. అప్పలాచార్యులుగారు. వనపర్తిసంస్థానము
45 వల్లెల్ల రాఘవులుగారు హైదరాబాదు
46 వాజపేయయాజుల రామసుబ్బారాయుడు, బియేగారు.
జటప్రోలుసంస్థానము
47 ఇంద్రకంటి నరసింహయ్యగారు. కర్నూలు
48 ఇంద్రకంటి కృష్ణమూర్తిశాస్త్రిగారు. కర్నూలు
49 అబ్బరాజు లక్ష్మీనారాయణరావుగారు. కొనికి
50 సరిపల్లె విశ్వనాథశాస్త్రి యంయేగారు. ప్రొఫెసరునైజాంకాలేజి
హైదరాబాదు
51 పాటీలు కేశవరెడ్డిగారు. విలేజీమునసబు, మొలగపల్లి
52 పాలపర్తి రామబ్రహ్మముగారు. ఆయిలుకంపెనీ, బెజవాడ
53 ఇటకాల రాజేశ్వరరావుగారు. వకీలు. కంభంమెట్టు
54 జమలాపురము వెంకటేశ్వరరావుగారు. వకీలు, కంభంమెట్టు
55 కొమరగిరి రామచంద్రరావుగారు. సూర్యాపేట

# అభినవసరస్వతి

సంపుటము 33 | వృష సం॥ పుష్యమాసము 1942 జనవరి 15 తేది | సంచిక ౧౦

## త్యాగరాజ మహోత్సవము

అయ్యది యథాపూర్వవైభవముతో నైనయది. పాకట్ల హనుమచ్ఛాస్త్రిగారుఁ బిరాట్ల శంకరశాస్త్రిగారుఁ బోలవరము రామచంద్రరావుగారు సంగీతవిద్వాంసులు. వీరు మువ్వురును సంగీతశాస్త్రాచార్యులగు త్యాగయ్యగారి కృతులను దదితరములను బాడి సభాస్తారులఁ జాల సంతోషపెట్టిరి. చల్లపల్లి పంచనాదముగారుఁ గోదమసింహాము లక్ష్మణాచార్యులుగారుఁ బిడేలును ముత్తేవు రంగాచార్యులుగారు మసురకవిగారు మద్దెలను వాయించుచు గానమునకు గౌరవమును గాశలకు విశ్రాంతిని గల్పించి వినువారివీనులకు గలిగించిన విందు విస్మరింపరానిది. శ్రీరంగరాజ రంగనాథభట్టరుప్రభృతులు వేణుగానముచే విద్వన్మనంబుల హరించిరి. అనుసుమల్లి నారాయణదాసుగారు, జూపూడి శ్రీరామమూర్తిగారు వెద్దింటి సూర్యనారాయణదీక్షితులుగారు బుద్ధవరపు మరంగేశ్వరరావుగారు హరికథాకథనముచే నందఱ నానందపఱచిరి. చిలుకూరు శ్రీరాములుగారు కథాగానముల బఠించియుఁ స్వాంధ్రీకృతానందరామాయణపద్యములు వినిపించియుఁ గవితామృతమును జవిచూపిరి. పుచ్చా సుబ్రహ్మణ్యశాస్త్రిగారు పూర్వోక్తాఖిల సభాంతములను వాని మంచిచెడ్డలను సంగ్రహముగా సభ్యులకు విమర్శపూర్వకముగా విదితము సేయుటయే కాక ప్రత్యేకముగా గానసాహిత్యములఁగూర్చి కడుఁజర్చించిరి. అంచన్యవిద్వాంసులును బాల్గొనిరి. గానముచేయఁబడు కృతులు మొదలైనవి యర్థమగు రీతి నిలుపవలసినచోట నిలుపుచునే తాళలయమేళనపూర్వకముగాఁ దజ్జన్యానందమును దా ననుభవించి పరులకుఁ బంచిపెట్టవలెనని ప్రతిపాదించిరి. హనుమచ్ఛాస్త్రి శంకరశాస్త్రిప్రభృతు లందు కొంకింత భిన్నముగాను నమూలముగాను జర్చించిరి. సుబ్రహ్మణ్యశాస్త్రిగారు సూచించినదే మున్ననని యనిపించెడిని. సంగీతసాహిత్యముల రెంటను సమ్యక్ప్రవేశముగల పండితులకుఁ వైరీతిఁ బాడుట కష్టసాధ్యము కాకపోవచ్చును. యతిపాదస్థానములమాత్రమే నిలుపుచుఁ జదివెడు పద్యపు టర్థ మందఱకు నగ్రాహ్యమైనట్లు సంగీతమును సాహిత్యమును బోషించుచుఁ బాడఁబడనప్పుడు శ్రోతృచిత్తములకు సుగమార్థ మగుచుండదనియే యస్మదభిప్రాయము. ఈవిషయమింతతోఁ దేలునది కాదు. లంక లక్ష్మీనారాయణశాస్త్రిగారు, ఇవటూరు సీతారామశాస్త్రిగారుమున్నగు నితరవిద్వాంసులును నీయుత్సవమున కరుదెంచి యాయావిషయముల నాకర్ణించుచును స్వాభిప్రాయముల వెల్లడించుచును సభల కలంకారముగా నుండుచు వచ్చిరి. కేవలము కథాగానశ్రవణకుతూహలముచే వచ్చినవారును గావలసినంతమంది కలరు. ఇందఱను సేమూడుదినములు విందొనరించి వివిధరీతుల నానందింపఁజేసిరి. ఈయాజమాన్య మంతయు సింగరేణికాలరీసులో సుప్రసిద్ధన్యాయవాదులగు గొట్టుపర్తి సుబ్బారావుగారిది. వీరీయుత్సవము 18సం॥లనుండి యవిచ్ఛిన్నముగ నాచరించుచున్నారు. వీరు న్యాయవాదులే కాక న్యాయప్రవర్తకులు, సనాతనధర్మపరులు, కవులు, గాయకులు, మహోదారులు. అందువలననే యంతకాలమునుండియుఁ త్యాగరాజోత్సవము లవిచ్ఛిన్నముగా సాగించుచున్నవారు. ఉత్సవమున కాహ్వానింపఁబడిన కథక గాయకు లందఱును

త్యాగరాజభక్తులే. కనుక వారు కట్నములకాసపడి వచ్చువారు కారు కానియైనను సుబ్బారావుగారు వారిని యథోచితసత్కారములచే నానందింపఁజేసి యానావానవ్యయము లిచ్చి పంపుదురు. వారినే కాక వచ్చినవా రందఱను సహస్త్రయము మృష్టాన్నపరితుష్టులం గావింతురు. పెండ్లిపేరంటములు మొదలగు పెద్దకార్యములలోఁగూడ మిల్లిగంటెలతో నేయివడ్డించు నిజామురాష్ట్రములోనిదే సింగరేణికాలరీసు. అయినను నాజ్యప్రవాహాభిషిక్తమగు భక్ష్యాన్నభూయిష్ఠమును నై సుబ్బరావుగారి యన్నదానము శోభింపఁగలుగుచున్నది. అన్నదానముతోపాటుపహారసౌకర్యమును రెండుపూటలు జరుపఁబడును. కాఫీయుపమాలకైన నేమి భోజనమునకైన నేమి, అన్నియు 4పూటలాహారము. ఇంతశ్లాఘ్యముగా నీయుత్సవము జరుపు సుబ్బారావుగారికి రెండుమూడు సంllల నుంచి యారోగ్యాభావ మేర్పడి యలమటింపవలసివచ్చినది. శ్రేయాంసి బహువిఘ్నాని. ఆయనారోగ్యముచే నాదాయ మంతగా లేమినిగాఁబోలు నీవత్సర ముత్సవము మానుకొనుటకే మతిపెట్టిరఁటకాని వారి స్నేహితులు కొందఱు బహుకాలమునుండి జరుగు పరమోత్సవమును మానవలదని కొంత తొందుపడి ప్రోత్సహించిరఁట. ఎట్లయిననేమి ! ఈయేటి యుత్సవము యథాప్రకారముగా నతివైభవముతో నైనయది. తురంగేశ్వరరాయాదుల కథాగానములు గతవత్సరములఁ గృతస్తుతులే కనుకఁ గొత్తవారివిషయము కొంత కొనియాడు టవసరము. విస్తరభీతిని విడువవలసివచ్చినది. ఎట్టిం విశ్వనాథగుప్తగారేవో కొన్ని పద్యములు త్యాగరాయలనుగూర్చి చెప్పి ముద్రింపించుకొనివచ్చిరాఁడఁ బఠించిరి. చిలుకూరు శ్రీరాములుగారు పెద్దింటి సూర్యనారాయణ దీక్షితులుగారి హరికథానంతర మీక్రిందిపద్యమును గీర్తించిరి.

మ. అమృతస్యంది కవిత్వవైభవము, బ్రహ్మానందముం గూర్చు గా
నము, సందర్భవిశుద్ధభావములు, విజ్ఞానప్రదంబైన బో
ధము నీసత్కథయందునన్ విని సముద్యత్సౌఖ్యముం బొందినా
రము పెద్దింటిశుభాన్వయాభరణ! ఆర్యా! సూర్యనారాయణా!

అధఃప్రకటీకృత మస్మదీయము.

సీ. యుష్మ దాకృతిఁ జూడ నొప్పెడి శాంతభా
వమె మూర్తిదాలిచి వచ్చినట్లు,
వాక్కు గన్గొందమా వఱలుఁ జందనశీత
లంబు విధేయంబు లలిత మగుచు,
కవిత వీక్షింతమా క్రమంబుఁ బ్రౌఢంబు
సుగమంబునున్ మఱి శ్రోతృతతికి,
విషయంబు నెంతమా విష్ణుభక్తిజ్ఞాన
వైరాగ్యముల నలవఱుపఁగలది,
వీనికన్నిటికిం దోడు గానరసము
ముమ్మరంబుగా మోదాబ్ధి ముంప సభను
రామదాసకథం జెప్పి తేమియందు
అహాహా! పెద్దింటి సూర్యనారాయణార్య!

---

5

## గీతాధర్మము

(శిష్టా సూర్యనారాయణశాస్త్రిగారు)

భగవద్గీతనుగురించి పండితు లనేకు లనేకరీతులుగా ... వ్యాఖ్యానములను రచించిరి. ఇటీవలిపండితులు కొందఱు గీత బౌద్ధమతానంతరమున రచింపఁబడినదనియుఁ గొందఱు బ్రహ్మసూత్రములు వ్రాయఁబడినపిదప వ్రాయఁబడియెననియుఁ జెప్పుచున్నారు.

భారతయుద్ధసమయముననే భగవద్గీత యుత్పత్తి యగుటచే బుద్ధునకుఁ బూర్వమునందే పుట్టినదని ... తెలియు ... గీతకు బ్రహ్మసూత్రములకుఁ గర్త యొక్కఁడే యగుట సూత్రముల భావము మనంబునం దుంచుకొనియే గీత వ్రాసియుండవచ్చును. లేదా, గీతాభిప్రాయము ను...ంచుకొని సూత్రముల వ్రాసియుండవచ్చును. ఎట్లు వ్రాసినను నిందుఁ బ్రతిబంధ మేమియు నుండదు.

...కృష్ణుని హృదయమే భగవద్గీతయనియు నిది కురుపాండవయుద్ధప్రారంభమున శ్రీకృష్ణునిచే నర్జునున కుపదేశింపఁబడినదనియు స్పష్టముగాఁ దెలియుచునే యున్నది.

" ... జీవాత్మ పరమాత్మలకు భేదములేదు, ఈరెంటి యేకత్వ ... జ్ఞానము... కలిగినఁగాని మోక్షము సిద్ధించుట దుర్లభము, ఏకము నిత్యము నగు బ్రహ్మముకంటె స్వతంత్రము సత్యము నైన రెండవ వస్తు వేమియు లేదు. నేత్రములకు గోచరించు భేదము మాయ యాభాస ... ఇటువంటి బ్రహ్మాత్మైక్యజ్ఞానము గలుగుటకు మానవుఁడాశ్రమవిహితముగా సర్వకర్మలుఁ జేసి తుదకు సన్న్యాసాశ్రమమునఁ బ్రవేశింపవలయును. ... కర్మజ్ఞానములు రెండును ... పరస్పరవిరుద్ధములైనవగుటఁ గర్మసంబంధసర్వవాసనలు వదలినఁగాని బ్రహ్మజ్ఞానపూర్ణత్వము సిద్ధింపదు. ఈసిద్ధాంతమే ... ప్రతిపాదింపఁబడియున్న"దని ... గీత...కు...శంకరులు ...భాష్యమురచించిరి...వారి యనంతరము సుమారు రెండువందలయేఁబదివత్సరములకు రామానుజు లవతరించి భగవత్పూజ్యపాదుల ... వాదము నద్వైతసిద్ధాంతము సత్యములు కావనియు జీవుఁడు జగత్తు నీశ్వరుఁడు నను మూఁడుతత్త్వములు భిన్నములయినను జీవుఁడు జగత్తు ... శరీరముగా నుండుటచేఁ జిదచిద్విశిష్టుండగు నీశ్వరుఁ డొక్కఁడే యనియు ... రెంటికి నైక్యముగ ... విశిష్టాద్వైతమే గీతలయందుఁ బ్రతిపాదింపఁబడియున్నదనియు భాష్యమువ్రాసియున్నారు. వారి తరువాత మధ్వాచార్యులవారు ... ద్వైతమే ... ప్రతిపాదింపఁబడియున్నదని ... భాష్యమురచించిరి. కాని ... శంకరాచార్యమతమే గీతాహృదయమనుటలో సంశయములేదు ... కృష్ణునకు మిత్రుఁడు జగదేకవీరుఁడు నగు నర్జునుఁడు ... యుద్ధమున బంధుహింస ... చేయుటా ? చేయకపోవుటా ? అను బలవత్తరవిచారము...తో...కర్తవ్యము తోఁపనివాఁడై...శరణుఁజొచ్చిన...భగవంతుఁ...డు గీత నుపదేశించి...ప్రవృత్తిమార్గమున...ప్రవర్తించునట్లు కావించెను. ... విధివిహితకర్మల...నిష్కామముగాఁ జేయుటే యుత్తమ మను తలంపుతో శ్రీకృష్ణుం డర్జునునకు ...నియమించెను.

...జీవన్ముక్తావస్థ కలుగక పూర్వము చిత్తశుద్ధ్యర్థమై...కర్మచేయుట ప్రతిమనుజునకు విధియని...యావద్భగవద్గీత సారాంశము...

—పరమేశ్వరుఁడు సర్వమానవులకు సమానుఁడు. కొందఱకుఁ బ్రియుఁడుఁ గొందఱకప్రియుఁడు గాఁడు. మానవమాత్రుఁ డెవఁడైనను గాని యనన్యభావముతోఁ దనను భజించినచో వాఁడు పరమగతి నొందునని...చెప్పియున్నాఁడు...

...కాని,...

జ్ఞానముగలిగినపిదపఁగూడ...పరమేశ్వరార్పణపూర్వకముగాఁ గర్మలు చేసినను —మోక్షప్రతిబంధకము లేనిహేతువుచే సృష్ట్యాదినుండియు సిద్ధావస్థనొందినపురుషులు లోకకల్యాణమును దృష్టియందిడుకొని కర్మయోగమునందే ప్రవర్తించుచు వచ్చిరి. జీవన్ముక్తునకుఁ గర్మలయందుఁ బ్రవర్తించుటకుఁ జిత్త ముదాసీనముగానే యుండును. కావఁ గర్మలను వదలినను ముక్తికిఁ బ్రతిబంధకము లేనిహేతువుచే...చేయుటకంటెఁ జేయకపోవుటే యుత్తమముగాఁ గనఁబడుచుండును. కాన...సామాన్యముగా...జీవితశేషముగడపుట కక్కువ...సుకరముగాఁ గనుపించు సన్న్యాసయోగమునే యవలంబించుచుండిరి. ఈహేతువుచేఁ గ్రమక్రమముగా—కొంతకాలమున నాచరణయందుఁ గర్మసన్న్యాసమే ప్రధానస్థాన మలంకరించెను...తరువాతఁ గొంతకాలమున కీసన్న్యాసము కలియుగమునందు నిషేధింపఁబడినది...శంకరాచార్యులవా రా నిషేధము తొలఁగించి ...పునరుద్ధరించిరి. ఈకర్మయోగ కర్మసన్న్యాస...ములలోఁ గర్మసన్న్యాసము నియమయుక్తమైన యొక యున్నతాధికారముగా నేర్పడి యాసన్న్యాసాధికారము...భరతభూమియం దగ్రస్థానము వహించిన బ్రాహ్మణజాతికిమాత్రమే... సంక్రమించెను ... నియమయుక్తమైన సన్న్యాస మవలంబించుటకు బ్రాహ్మణజాతి వినా యితరజాతుల కర్హత లేదు...

... బ్రాహ్మణేతరులలోఁగూడ...సన్న్యాసరూపముగాఁ గాకపోయినను నేదో యొకరీతి సర్వకర్మలను వదలి...జీవితము గడపుట గలదు...ఈహేతువుచేతనే యుద్ధానంతరము ధర్మజుఁడు వైరాగ్యముచే సర్వకర్మలను వదలి యరణ్యమున కరిగి తపమాచరించెదనని...సంసిద్ధుఁడయ్యెను...జనకుఁడు కర్మయందుఁ గలిగిన యుదాసీనతచే ... సన్న్యసించి యరణ్యమున కరుగవలయునని సంకల్పించెను...ధర్మజుఁడు జనకుఁడు నయుక్తమాచరించుటకు సంకల్పించిరనుట కవకాశము లేదు...జనకుఁడు మొదలుగాఁగల రాజర్షులందఱు నేరీతి సర్వకర్మలను వదలవలయునని తలంచిరో యారీతిగానే యర్జునుఁడు కూడ... సంకల్పించినపుడు కృష్ణుం డతనికిఁ గర్మయోగ కర్మత్యాగముల స్వరూపము వివరించి...యుద్ధకర్మ చేయించెను...

... శంకరాచార్యులవారు ... గీతయందు సాంఖ్యమే పరమావధిగానున్నదనియుఁ గర్మయోగము...బ్రహ్మజ్ఞానముగలుగకపూర్వము ... చిత్తశుద్ధికై యాచరింపవలసిన కర్మనుగుఱించి చెప్పఁబడినదనియు బ్రహ్మజ్ఞానముగలుగకముందు...కర్మల నాచరించుటే యుత్తమమనియు నర్జునుని ప్రశ్న తదనుగుణమనియు సాంఖ్యమే పరమావధి యని శ్రీకృష్ణాభిప్రాయమనియు...భాష్యము రచించిరి...

... శాస్త్రిగా రర్జునవిషాదమును జూచి భారతకాలమునాఁడు భరతఖండమంతయు జాతిభ్రంశమై యున్నదని వ్రాసియున్నారు.

కానున్న యుద్ధమైనచో...పురుషులందఱు నశింతురనియు నశించుటవలన స్త్రీలు దుష్టవర్తనలగుదురనియు...దుష్టసంతానము జనించి దేశమంతయుఁ జెడుననియు

నర్జునుఁడు చింతించుచున్నాఁడుగాని పూర్వమునందే... జాతిభ్రంశమైయున్నదని కాదు. భరతఖండ మంతయు నిదివఱకే వర్ణసంకరమై యందు సంకీర్ణుఁడుగా నుదయించిన యర్జునునకు విషాద మేలకలుగవలయును? జాతిభ్రంశమును గుఱించి శాస్త్రిగారు కలవరించుచున్నారుగాని భరతఖండము జాతిభ్రంశమై యుండలేదు. సంకీర్ణసంభవుఁడైన యర్జునుఁడు యుద్ధమునందు సంకరుల నందఱను దనపక్షమునకుఁ జేరఁదీయుచుండెనని వ్రాసినశాస్త్రిగారిచ్చట... సాంకర్యమునకుఁ జింతించుచున్నాఁడని వ్రాసియున్నారు. కాన నివి విమర్శార్హవాక్యములు గానందున... విరమించుచున్నాను.

---

## —♦ ఆంధ్రభాష ♦—

(గద్వాలసంస్థానపండిత గాడేపల్లి వీరరాఘవశాస్త్రిగారు)

శా. నాదేశం బని నాదురాజ్య మనియున్ నాతెల్గు నాతెల్గటం
చే దేశస్థులకంటె సత్కృతులలో హెచ్చించి పోషించి మ
ర్యాదన్ నీకిడఁ గృష్ణరాయనృపుఁడా? ఆ రాజరాజేంద్రుఁడా?
నీ దౌర్భాగ్యము వెంట వా రరిగి రాంధ్రీ! దూఱటం గాంచుమా. 1

సీ. మనుమసిద్ధినృపాలుఁడని చూడ మన కవి
బ్రహ్మ యేలిక భువిఁ బాసి పోయె.
శ్రీనాథకవిని బోషించిన మన వీర
భద్రభూపతి దివిఁ బదము వెట్టె.
కవిమణినిలయమై క్రాలిన కాకతి
వీరరుద్రుఁడు నింద్రుఁ జేరఁబోయె.
విద్వత్కవుల నేలి విఖ్యాతి గొనిన గో
బ్బూరి నృసింహుఁ డేమాటె చనియె.
స్వాభిమానపరాయణాస్థానసభల
దురభిమానంబు లెచ్చి నెత్తురులు చచ్చి
వివశు లగువార లావిర్భవించినారు.
కొడుకు లిటులైరి. పరుల నేమడిగె దాంధ్రి! 2

మ. పలుకం బాడను జట్టపక్కములలో భాషింప నిల్లాండ్రతో
వల పూరింప నుపన్యసింపఁ బ్రజతో భావం బెఱింగింపఁగన్
తెలుఁగే నేఁటికి మాకుఁ గావలయు. సందేహంబు లే. దైన ర
చ్చలలో సత్కృతు లింగిలీషునకు. భాషాపోషకుల్ తాదృశుల్. 3

సీ. పిల్లికి మీసాలు పిడికెఁడంచు వచింప
రాజభాషగుఁ గానఁ బ్రైజు దొరకు.

గాడిదె వృషణముల్ కణికెఁడంచు లిఖింప
　　హర్యాణభాషని బహుమాన మొదవు.
గ్రద్దకంటెను గాకి కడుఁబెద్దది యటన్న
　　నృపభాష యని బహూకృతి లభించు.
రంగఁడు నెత్తి గోఱెంగినాఁడని వ్రాయ
　　ఆంగ్లభాషనుచు మర్యాద గలుగు.
తెలుఁగున గణించి యాణిముత్తెములగుముల
నెమకి సమకూర్చినను గమనించువారు
తుదకుఁ దల యూఁచువారైన దొరకరిచట
అకట! త్రైలింగవాఙ్మయంబా! నమోస్తు. 4

సీ. వీరేమి లండను విద్వాంసులా యన్న
　　ఇచ్చట మనలోని యిండియనులె.
దేశభాషయె రాని తెల్లవారా యన్న?
　　ఎల్లవార లెఱుంగు నల్లవారె.
ఖండాంతరములలో ఘనతరోద్యోగులా?
　　ఇండియన్ కొలువుల కేగువారె.
తెల్గు పేరెఱుఁగని దివ్యసంతతివార!
　　స్వాభిమానములోనఁ జనెడువారె.
కాని నీదురదృష్టశకాన వారి
కీళ్ళు స్వాధీనతను దప్పి యొళ్ళు మఱచి
బుద్ధిపూర్వకముఁగ నిన్నుఁ బూర్తి మఱచి
తిరుగుచున్నారు తనయు లో దేశభాష! 5

సీ. దేశభాషలలోనఁ దెలుఁగు లెస్సని వ్రాసి
　　డంబైనతనకిరీటంబు వెట్టె.
చిక్కనితేనియల్ చిలుకు కావ్యంబుల
　　ప్రౌఢిమఁ దను దానె పాడుకొల్పె.
కర్ణాటధారుణీకాంతుఁ డయ్యును గవి
　　రాజుల కప్పు డాంధ్రభోజుఁ డయ్యె.
అష్టదిగ్గంతికవ్యగ్రేసరుల నేలి
　　అందఱిమోఱ్రిల శుద్ధాంధ్రిఁ దగొయ్యె.




అట్టి శ్రీకృష్ణరాయల కవుల నేఁటి
కాంధ్రభాషానుయాయుదత్తామితాల్ప
సత్కృతులు లేవఁటనుచుఁగా! చాలుఁజాలు.
తేజరిల్లెడ వలదు మా తెల్గుభాష! 6

---

## పోతరాజుగారు నిజామురాష్ట్రమువారే

(శతావధాని శ్రీ చెళ్లపిళ్ల వెంకటశాస్త్రిగారు)

పోతరాజుగారు నిజామురాష్ట్రమువాఁడా కడపమండలమువాఁడా యనుమాఁ గొంతకాలముక్రిందట వాదోపవాదాలు జరిగియున్నవి. దానికిఁ గొంతయాధారము నిజామురాష్ట్రమువాఁడే యనుటకు సింగనకవిందుని పద్మస్కంధములోఁ గనఁబడుచున్నది. సీ. వృషలియం దనురాగవృద్ధి బిడ్డలఁ గని కులము గోదావరిఁ గూలఁద్రోసి యనెడి పద్యమును బట్టి చూచిన గంగన్నగారు గోదావరీతీరానకు సంబంధించిన మండలమువాఁడుగాఁ దోఁచెడిని. గోదావరి చాలభాగము నిజామురాష్ట్రమండలములలోఁ బ్రవహించినది. మూలములో నీఘట్టములో గోదావరీప్రసంగము గాని గంగాప్రసంగము గాని లేదు. గోదావరీతీరస్థులలో కొక్కని వాడుట యున్నది. అందుచేత సింగయ్య గోదావరివాఁడే యని యొప్పుకొనెడి యెడల నీయనకుఁ బోతన్నగారితో శిష్యత్వసంబంధము కాకపోయినను నేదో బాంధవ్య ముండితీరఁగలదు. రైలువగైరా సదుపాయాలు లేని యారోజులలో నిజామురాష్ట్రములో నుండెడి సింగయ్యగారికిని గడప మండలములో నుండెడి పోతరాజుగారికిని జట్టుజతికము కల్పుట కంటె నుభయులు నొకటేమండలమువారే యయియుండెడరన్నది యుక్తిసహముగా నుండఁగలదనుకనుకఁ బోతరాజుగారు నిజామురాష్ట్రమువారే యన్నవారివాదములో నే నేకీభవించుచున్నాను.

ఇఁక బొప్పనామాత్య పుత్రుఁడు గంగనార్యకవినిగూర్చి రెండుమాటలు వ్రాసెదను. ఉత్పన్నభాగాలు పూరించినవారిలో నీయన కవిత్వము చాలఁ దక్కువయని వేరే చెప్పనక్కఱలేదు. ఈయనకూడ ధారాశుద్ధికలవాఁడు. నారయ్యగారికిఁ దప్పఁ దక్కిన పూరకులకు లిద్దతికిని బోతన్నగారితో నేలాటిసంబంధమున్నదో గ్రంథమునుబట్టి తేలదు. ఆయా గ్రంథమును బూరించుటనుబట్టియే యేదో చుట్టఱిక ముండెనని యూహించుట యుక్తిసహము కాదు. ఆపద్ధతిని నన్నయ్యగారికిని దిక్కన్నగారికిని చుట్టఱికము కల్పవలసివచ్చెడిని. ఒక కవికిని వేఱొక కవికిని బాంధవ్యము కల్పవలసివచ్చిన నన్నిటికన్నను బ్రధానమైనది కవిత్వమే యనుకొనిన నేచిక్కును నుండదు. ఈయన ధారను దెలిసికొనుటకొకటి యుదాహరించెదను.

ఉ. అచ్చట విప్రసూనుఁడు భయం బొకయించుకలేక చంపఁగా
వచ్చినవారియందుఁ గరవాలమునందును గాలియందుఁ దా
నచ్యుతభావ ముంచి హృదయంబునఁ బద్మదళాక్షు నెంతయున్
మచ్చికతోడ నిల్పి యనుమానము నొందకయుండె నెంతయున్.

అంతగా వెదకి వెదకి యుదాహరించలేదు. సంఖ్యాపూరణమును బ్రధానముగాఁ బెట్టుకొని నిష్కర్షించెడి తెగవారికి దీనిలో సెంతయుక్, అనెడి పదము రెండుమారులు రెందుకురావలెననెడిని యొక శంక కాకపోదు. భారతమునుంచి దీనిని సమర్థించుట కెన్నో యుదాహరణలు చూపవచ్చును. అలాటివి శంకలును గావు, ఈలాటివి సమాధానాలును గావని ప్రాజ్ఞులైన సహృదయు లెఱిఁగియే యుండెదరు. మూడవచరణములో నవ్యాతభావమునుంచి యనెడిది ప్రాసలోఁ బడినది. చకారద్విత్వమునకేమి? పాణినీయమువల్ల సాధింపవచ్చును. యకారాధిక్యము సమర్థించఁబడఁగలదా యనినఁ జాలనుండి యీషద్వైషమ్య మవివక్షితముగాఁ బ్రాసవిషయములోఁ బ్రయోగించుచున్నారనియు ద్విత్వప్రాసస్థలములలో నుచ్చారణలో విశేషవైషమ్యము లేని పద్ధతిని బ్రాసమైత్రి చెల్లఁగలదనియు మహాకవుల పోకడలు సాక్ష్యమిచ్చుచున్నవి. ఆమహాకవులయందు గౌరవమున్నవారు వారిమార్గము ననుసరించెదరు. లేనివారు మానుకొనియెదరు. దీనికి నన్నయ్యగారుకూడ వ్యతిరేకించెడివారు కారు. వారు వ్యతిరేకశ్వాసకమైన లేక యనెడిదానిని దిద్ద వీలులేనిచోట బ్రతిపత్తికృతికముగా లేకను నని జరత్కారుచరిత్రలో వాడియున్నారు. ఆ హేతువు చేతనే యనుకొనియెదను బ్రాచీనతాళపత్రగ్రంథములలో నేమి యచ్చుప్రతులలో నేమి సర్వత్ర వ్యతిరేకశ్వాసకరూపాలు ద్రుతాంతాలుగానే కనఁబడుచున్నవి వందలు వేలుగా నుండుటచేత నుదాహరించలేను. దానిని సముచ్చయముగాఁ గొందఱు సమర్థించినారు. అలాగే యెఱ్ఱన్నగారు సంధిపేరను సల్పిని హరివంశములో యతిస్థానములో బ్రయోగించుటచేతఁ జిన్నయ్యసూరి న్యాయముగాఁ బూర్వపద్ధతి ప్రయుక్తించిన నీతిచంద్రికదగ్గఱనుంచి యొఱఁగించి తెలుఁగించి వినుపించి వగైరా యనుకాకుఘటితరూపాలతో నిండియున్నవి లోఁగడపుస్తకములు. ఇటీవల నన్నియు దిద్దఁబడ్డవి. ఆ యతిస్థానము మాత్ర మాలాగే యున్నది ఈదిద్దుఁబాట్లన్నియుఁ బ్రమాదాలనుటకును వల్లకాదు. విమర్శకులు పరిశీలించి యుక్తాయుక్తనిర్ణయము చేసికోవలసియుండెడిని. దానికిఁ దగినంత పిండి యుండవలె. అది లేనివారు వృథాగా వాదోపవాదాలు పెంచుకొని తద్ద్వారమున వ్యక్తి నవమానపఱచెడివారిఁక నిద్దురపట్టక మనోవ్యాకులమునకు గుఱికావుట శోచనీయము కాకపోదు ఒకటే ప్రయోగము నాధారముగాఁ బెట్టుకొనియో యేదో ప్రయోగించుకొనియెదరు. వేయేల? కావ్యాధారము నచ్చక యది సమంజసము కాదనుచో రెండవవారు సమంజసమే యనియెదరనుకొనుఁడు. ఇంతలో వచ్చిన పుట్టిమునుఁక యేమున్నది? దీనివలన నెవరికిఁగాని వచ్చెడియవమానము కనఁబడదే? మహాఋషీణాం మతయశ్చ భిన్నాః- ఇది నేఁడే వచ్చినదా? అనాదిగానే యున్నది. నే నేకవుల ప్రయోగాలనుకూర్చి తోఁచిన సమర్థనము వ్రాయుచున్నానో యాకవులు నాకుఁ జుట్టాలు గారు. వారి ప్రయోగాల ద్వారమున నాప్రయోగాలు సమర్థించుకోవలసినవి లేవు. ఇంకెందుకనిన? ఈ తెలుఁగు నానాసాంకర్యాలతోఁ జేరినదగుటచేత

తే. గీ. కేవలగ్రామ్యపదముల నేఱగించి
జనులు వాడెడిపదములు సమ్మతములు
కలవు లేవని పెనఁగ శక్యమ్మె! భార
తాదులను లేని పదములు నవసిఁ గలవె?

అని బోధించుటకే. ఈసమర్థనము నామోదించుట కిష్టములేనివారు కొందఱుండెదరు. షష్ఠములలోని వర్గె రా యెవరివో ప్రయోగాలున్నవి కొన్ని. అవి సమర్థించినప్పుడుకదా యాలోచింపవలసియుండెడి యనుచుఁ బ్రశ్నించెదరు. అలాటిప్రయోగాలు నాకు సాధ్యముగావనియే మనవిచేసెదను. ఇంద్రాణి యున్నదికదాయని శక్రాణి యనిన నే సమర్థింపఁగలనా? ఓష్ఠశబ్దము నోష్టశబ్దముగా మార్చి ప్రాసస్థానములోఁ బ్రయోగించిన నావల్లఁ గాఁగలదా? పరభృతశబ్దమును పరభృత్తుగా హలంతము చేసి వాడుచో నేను సమర్థించఁగలనా? సమర్థించలేననియే నాప్రత్యుత్తరము. ఇంకను నీలాటివి యెన్నో యున్నవి నేను సమర్థించలేనివి. గ్రంథవిస్తరభీతిచే వాని నన్నిటిని నుదాహరించలేను. కాని యీశబ్దములు నాకు సాధించరానట్లు తోఁచినంతలో నే తప్పులనుకొని జాబితాలో నెక్కించి యాక్షేపించుటకు మాత్రము సాహసము చాలదు. ఏమో యెవరికైనను నిందులో నన్నియుఁ గాకపోయినఁ గొన్నియైన సాధ్యము కాఁగలవేమో, మనము తొందరపడఁబడదని యని యాలోచించుటయే నా కలవాటు. అందుచేతనే నే నెప్పుడుగాని యొకరికవిత్వమును గాని విమర్శించి ప్రకటించుటయును మనుండెను. యీనవావస్థలోఁ గాఁబోలును మాకవిత్వమును నిర్నిమిత్తముగా ననుచితముగా విమర్శించి యొకాయన ముందుగా మామీఁదికి వచ్చిన దానికి జవాబువ్రాసి యూరకుండక యాయన వ్రాసిన పూర్వకావ్యములయందలి దోషములను నిరుత్తరముగా విమర్శించి ప్రచురించుట జరిగినది. అప్పటినుండి యనవరతముగాఁ గనఁబడ్డప్పటికి నిటీవల మనని మనము సమర్థించుకొనుటకొఱకే యావశ్యకముగాని యావలివారి లోపాలు బయటఁబెట్టుట యంత యావశ్యకము కాదనియే నాకుఁదోఁచెను. ఇటీవల వాదోపవాదాలలోఁ బ్రత్యేకించి యొకటివాంఛను విమర్శించినట్లయినఁ లేదుకాని ప్రసక్తానుప్రసక్తముగా నావలివారికవ్యులను స్వచిత్తముగా గ్రహించగత్యాగత్యంబుశలగాఁ జూపుట జరుగలేదని వ్రాయఁజాలను. ఇదియు ననవసరమే. ఏమనియెదరా? ప్రతివాడు లవమాత్రములయినంతమాత్రములో నిజముగాఁ దనరచన దోషభూయిష్ఠమే యనుచో లేశమును సమర్థించఁబడదని నా దృఢవిశ్వాసము. కవికిని బాధకుననును నే నవమానము నంగీకరించెడివాఁడను. నీపంటలో లోపమున్నదని తిరిగెడివాండ్రనెన్నెప్పుడు నీవు వండినవంటకూడ దుష్టమే యనుచో నేమి ప్రయోజనము? ఆవలివాఁడు పాచకత్వములోఁ బ్రవేశము బొత్తిగా లేనివాఁడుకూడఁ గావచ్చును. కొంత ప్రవేశ మున్నవాఁడైనను నతనిపాకమును యిష్టముగ నిరూపించినంతలోఁ దనపాకములో నున్న లోటుపాట్లు సవరణకావు. అందుచేత నాక్షేపకు నాక్షేపించి ప్రయోజనములేదు. తుదకిప్పు డేమితోఁచుచున్నదనిన_ ఎవరైనను నరే తన రచన నాక్షేపించిన నాక్షేపించెదరుగాక. క్షమినాస్తిగా నూరకుండిన లోకమే దాని తత్త్వమును దెల్పఁగలదని తోఁచుచున్నది. కాని యేకో యొకవిషయమును స్వీకరించుకొని తన యనుభవమును వెల్లడించుటవల్ల జిజ్ఞాసువులకుఁ గొంత యుపకార ముండెడివనికూడఁ బెద్ద లంగీకరించెదరు. స్పర్ధయా వర్ధతే విద్యా యన్నవిన్నను నేఁడును బుట్టినది కాదు. అందుచేత నదియు మన్నించఁదగినదే. కాని కేవలము వార్థక్యములో నింకను విద్యాభివృద్ధి చేసికొని పొందెడి ప్రయోజనమేమి? కనుక నే యీవిషయమీఁద సంస్కృతాంధ్రభాగవతములు చదువుట పెట్టుకొనవచ్చునుగదా! యని భాగవతప్రయోగాలను గూర్చి వ్రాయుట కుపక్రమించినాను. తోఁచిన కొన్ని నాల్గుమాటలు వ్రాసినాను. బాగుండిన స్వీకరించెదరు శుశ్రూషువులు. లేదా, త్రోసిరాజనియెదరు. ఈకారణముచేత భాగవతకాలక్షేపము జరిగినదని నేను సంతోషించుచున్నాను.

---

## —♦ యుద్ధము - ఇండియా ♦—

...హిట్లరు... యుద్ధము ప్రారంభముచేసి భయముతోఁ గొన్ని దేశములను నయముతోఁ గొన్ని దేశములను స్వాధీన పఱచుకొనినాఁడు... ఇంగ్లాండుపైకి దాడివెడలి... రష్యాతో యుద్ధమును గల్పించుకొని... జపానును ఉఱికొల్పి ప్రాచ్యదేశములపైకి పంపినాఁడు ...జపాను, అమెరికాదేశముపైనను పసిఫిక్ రాజ్యముల పైనను యుద్ధము ప్రకటించి థాయిలాండును స్వాధీనపఱచుకొన్నది....అతిఘోరముగా యుద్ధమును జరుపుచున్న వార్తలు వచ్చుచున్నవి. విలువగల నావల ముంచుచున్నట్లును దెలియుచున్నది. జపాను...మూలముగా నిప్పటికిఁ బాశ్చాత్యదేశమునమాత్రమున్నయుద్ధ మిప్పుడు ప్రపంచయుద్ధముగాఁ బరిణమించినది. ఇన్నాళ్ళవఱకు.. చీనాతో మాత్రము యుద్ధము సలుపుచు నిప్పుడు అమెరికా మీఁద యుద్ధము ప్రకటించుటకు హిట్లరు సహాయసంపత్తియే కారణమని ''విమానములు జపానువారివైనను వైమానికులుమాత్రము జర్మనీదేశస్థులవలె నున్నార''ని వార్తలవలనఁ దెలియుచున్నది... అమెరికా బ్రిటీషువా రెంతచెప్పినను జపానుపై రష్యా యుద్ధము ప్రకటించుటలేదు.. శాంతి సూచనలుకూడఁ గొన్ని వినవచ్చినవి. దీనినిబట్టి రష్యాదేశము ఫ్రెంచివారివలె సంధిఁ జేసికొని యుండవచ్చునా ? యని యూహాపోహములు సహజమే. జపానుదాడి బహుతీవ్రముగ సాగుచున్నది... సింగపూరు, బర్మా, రంగూను మొదలగునవి... ఇండియా, ఆయుద్ధజ్వాలలోఁ బ్రతిఫలించుచున్నది. ఆబాంబుల ధ్వనులు, అఫిరంగుల ధ్వనులు, అంతర్జ్వాలయిందులలోఁ బ్రతిధ్వనించుచున్నవి. బొంబాయి, మదరాసు, కలకత్తాప్రభుత్వములవారు రక్షణలవిషయమై బాగ రూఢులనే యున్నట్లు దెలియుచున్నది....ఒకవైపున సమయముఁజూచి యాఁకలి బాధల నాపుకొనలేక దుండగీండ్లు దుకాణములను, గ్రామములను బట్టణములను దోఁచికొని పోవుచున్నట్లు తెలియుచున్నది. ధరలు మితిమీఱిపోయినందున బీదలు తినుట కన్నములేక యల్లాడుచున్నారు. ఈ ఘోర సంగ్రామ నిశాంధకారములో దిక్కు దెలియక దేవుఁడు ప్రపంచమున కవ్యాకప్రభాత ప్రశాంతకాంతు లెప్పుడుదయింపఁ గలవోగాని ప్రస్తుతముమాత్రము జగత్తంతయు నుడికిపోవుచున్నది. ఇంతమహావిప్లవమునకు నధర్మప్రవృత్తియే కారణము. బాల్యవివాహ నిషేధశాసనమును, పంచమాలయ ప్రవేశమును, గాంగ్రెసువారితో నేకీభవించి శాసనరూపముగఁ జేయుటవలనఁగదా యింత యధర్మము చెలరేగినదని తోఁచెడి. అదేమిచిత్రమో!...మధుర మీనాక్షీ ...లయ మందుఁ బంచములఁ బ్రవేశపెట్టఁగనే కర్తలు కాంగ్రెసువారు పదచ్యుతులైరి. వెంటనే యుద్ధజ్వాల లలముకొనె...''బుద్ధిః కర్మానుసారిణీ'' దైవ మనుల్లంఘనీయము.

కాని యిప్పటికైనను మించిపోయిన దేమియులేదు. వర్ణాశ్రమాచారాది ధర్మబద్ధమగునట్లుగా స్వాతన్త్ర్య మొసంగఁదలేని... ధర్మము కాంగ్రెసును బ్రభుత్వమును రక్షింపఁగలదు. కాన...ధర్మబద్ధ స్వాతంత్ర్యము నిచ్చి భారతదేశము యుద్ధమునుండి గాక తదితర కలహములనుండియు, అధికసత్తాక వర్గమువారి బాధలనుండియు రక్షింపవలయునని ధర్మరక్షణగల శ్రీ ప్రభుత్వమువారిని ప్రార్థించుచున్నాము. (దివ్యవాణి)

---

త్రానూనాత్మలు మంత్రిముఖ్యులు జయంతాదుల్, సఖుల్, సర్వరా
ట్సూనుల్, పంక్తిరథాది భూపతులు, విజ్ఞుల్ పౌరులున్, భృత్యులున్
క. కౌసల్యాద్యవరోధవధూసంతతి నగలరోదయుఁ దోఁపనటు గవా
క్షాసీన లగుచుఁ దదుపన్యాసము నాలించి రెలమి నస్పందముగన్.
వ. మఱియు 525
ఉ. చేఁతలు మాని పంజరపుఁ జిల్కలు నెంతయు నిశ్చలస్థితిన్
గూఁతలు మాని కేళివనకోకిలలున్ మెడలెత్తి చూచుచున్
మేఁతలు మాని యంతికపు మేలితురంగములున్ గురంగముల్
ప్రీతిగ నాలకించెను బవిత్రములౌ రఘురాము సూక్తులన్. 526
క. నారదశక్తిపరాశర పారాశర్యాంగిరశ్చ్యవనపులహముఖుల్
సారోదారతపోధను లారాము వచోమరంద మాని రిలేశా! 527
క. సురగరుడోరగవిద్యా
ధర కిన్నర సిద్ధముఖ్యదైవతగణముల్
సురమార్గమున విమానో
త్కరములఁ గూర్చుండి వినిరి దాశరథి నుడుల్. 582
వ. అట్టియెడ 529
శా. ఔరా! యంచు బలే! యటంచు బళిరా! యంచున్ సెబాసంచు వ
హ్వారే! యంచును మేలుమేలనుచు నాహాయంచు మజ్జా యటం
చారామోక్తులు సాధువాదములతో నగ్గించి హర్షించి రా
తారామార్గమునందునుండి దివిజుల్ తత్పారవశ్యంబునన్. 530
వ. అంత సిద్ధసంఘసమీరితంబై 531

## —• పుష్పవృష్టివర్ణనము •—

మ. మధురామోదమనోహరంబు వికసన్మందారపుష్పభ్రమ
న్మధులిణ్ణాదసుమేదురంబు ప్రపతన్మల్లీసమూహాస్రవ
న్మధుధారాకలితంబు కైరవరజోమందీకృతాలోకమై
అధికాశ్చర్యకరంబునై కురిసెఁ బుష్పాసార మూర్వీశ్వరా! 582
వ. అట్టితఱి నవ్వీరులముసురు 533
సీ. అంబరకాయమానంబునన్ దివిజులు
కట్టిన తెలిమేలుకట్టనంగ

దివ్యవాయుప్రపాతితమై ధరాస్థలిఁ
బడుచున్న తారకాప్రచయ మనఁగ
వసుమతీతలమునం బ్రసరించు దేవతా
కాంతావిశదహాసకాంతి యనఁగ
పుడమిఁ జేరెడు వేడ్క యడరంగ వడివడి
నరుదెంచు శరదంబుదాళి యనఁగ
తే. వెలుఁగు గల్పించుచుఁ మంచుకరుడులట్లు
పాలమున్నీటి కెరటాలభంగిఁ జంద్ర
కిరణములరీతి ముత్యాలసరులభాతి
మిసిమిముద్దల లీల సంతసము గూర్చె 534
వ. అట్లు నిరభ్రంబగు నీలాకాశంబునుండి కుసుమవర్షంబు కురియు
చుండ. 535
క. మెడ లెత్తి చూచువారలు
నొడ లెఱుఁగక తిరుగువార లోహో యిది యె
న్నఁడు నెఱుఁగ మనెడువారై
కడునబ్బురపడిరి త న్నగరవాస్తవ్యుల్. 536
ఉ. ఈవిధి దేవతాకరసమీరితమై సుమవృష్టి సౌరభ
శ్రీ వెదఁజల్లుచుఁ గడు విచిత్రముగాఁ బురమందు రథ్యలుఁ
గోవెలలుఁ సభాస్థలులు గోపురముల్ గృహచత్వరంబులుఁ
జావడులుఁ హజారములు సల్పెను బుష్పమయంబుగఁ నృపా!
వ. అంత ముహూర్తచతుర్భాగమాత్రంబు కురిసి విరిసోన విరమించు
టయు గగనతలంబుననుండ 538
సీ. కల్పమాదిగను స్వర్గంబెల్ల గ్రుమ్మరు
చున్నవారము మన మెన్నఁడేని
వినియున్నవారమే వీనులకుఁ రసా
యనమై యపూర్వమై యలరు నిట్టి
సూక్తుల? నే డెంతసుదిన? మీపలుకులు
విననిజన్మంబులు వృథలు వృథలు
రామచంద్రుని యివ్విరాగవాక్యము లగో
చరములుసుండు వాఙ్జానికైన

తే. అహహా! ధన్యులమైతి మీయనఘచరితు
వలననే కద మన నాకవాస మిట్లు
పారమాట యెఱుంగఁగాఁ జాలినార
మనెడు సురవాక్యములు సభాజనులు వినిరి. 539

## —♦ నభశ్చరమహీచర సంమేళనము ♦—

వ. అయ్యెడ నాకాశమార్గంబున సిద్ధు లిట్లనిరి. 540

క. అనఘుఁడు శ్రీరాముఁడు చె
ప్పినవాక్యమ్ములకు బ్రహ్మవిద్వరులగు నీ
మును లేమి నిర్ణయింతురొ
వినఁగాఁదగు మనకునెల్ల వీను లలరఁగన్. 541

వ. కావున. 542

తే. గీ. నారదవ్యాసముఖ మునినాథులార !
రండు వేవేగ దశరథరాజుసభకు
ఆలకింతము మునులవాక్యముల నచట
నబ్జమునఁ దేంట్లు విరిదేనె నానునట్లు. 543

తే. గీ. ఇటుల సిద్ధులు పిల్చినంతట సమస్త
దివ్యమునులును వెస బయల్దేఱి వేడ్కఁ
బంక్తిరథు పుణ్యసభ కేకపంక్తిగాఁగ
నవతరింపఁదొడంగిరి దివమునుండి. 544

క. ముంగలియై శరదంబుధరాంగుఁడు వీణామునీంద్రుఁ డరుదేరంగన్
బింగలియై ప్రావృడ్జలదాంగుఁడు వ్యాసుండు నడచె నమ్మునితతికిన్.

క. ధీరప్రశాంతసుభగాకారులు లోలాక్షమాలికావలయధరుల్
చారుకమండలుధారులు స్ఫారజటాజూటు లతివిశాల లలాటుల్.

తే. గీ. పులహభృగ్వంగిరః పులస్త్యులు నుశీర
నాకుసంభవ వాత్స్యాయనక్రతువులు
చ్యవనశరలోమ దేవపుత్రాది మునులు
నడచి రమ్మౌనిపంక్తికి నడుమ నధిప! 547

వ. వెండియు నమ్మునితండంబు పండువెన్నెలభంగిఁ దారావళితీరున
భానుమండలిభాతిఁ బూర్ణచంద్రపరంపరమాడ్కిఁ జూడ్కులకు

వేడ్కఁ జేయుచు నవని కవతరించుటయు దశరథుని సభాజనంబు తద్ద్వారవార్థంబు లేచి నిలువంబడె. ఇట్లు నభశ్చరమహీచరులు మిశ్రీభూతులై పరస్పరశరీరకాంతుల దశదిశలు వెలింగించుచుండిరి. అయ్యవసరంబున. 548

సీ. వేణుదండాన్వితపాణిపంకేరుహుల్
విలసితలీలారవిందకరులు
లలితదూర్వాంకురాలంకృతమూర్ధజుల్
చూడామణీ సువిస్ఫురితశిఖులు
కపిలజటాజూట కనదుత్తమాంగులు
మౌళిమాలిత లసన్మస్తకులును
అక్షమాలాసముద్యన్మణిబంధులు
మల్లికావలయ రమ్యప్రకోష్ఠు
తే. గీ. లచ్ఛవల్కలధరులు పీతాంబరులును
దర్భమౌంజీకలితులు ముక్తాకలాపు
లయిన భూచర ఖేచరు లగుమునీంద్రు
లొక్కచోఁ గూడి కడుఁ జూడ నొప్పి రపుడు. 549

వ. అంత 550

క. అనఘులు వశిష్ఠకౌశిక
మునులు వియచ్చరుల కర్ఘ్యములఁ బాద్యములన్
వినయవచోరచనల న
ర్చనలన్ గావించి రధికసమ్మోదమునన్. 551

వ. సిద్ధవరులును వశిష్ఠవిశ్వామిత్రుల నుచితవిధానంబునం బూజించి దశరథుచే సభక్తికంబులగు సత్కారంబుల నర్చితులై యతనిం గుశలప్రశ్నాదికంబున సంభావించిరి. పిదప నభశ్చరమహీచరు లన్యోన్యప్రణయసంరంభంబులం బ్రాప్తసత్కృతు లగుచు విష్టరంబుల నుపవిష్టులైరి. 552

ఉ. అంత రఘూద్వహుండు వినయమ్మున నమ్మునినాథ పాదప
ద్మాంతికమందు నెమ్మదియుఁ నంగములన్ ధర సోఁక మ్రొక్కి, వా
రెంతయుఁ గూర్మి మీఱ వచియించిన దీవన లంది, మూర్తిమ
చ్ఛాంతి యనంగఁ దచ్చరణసన్నిధి నమ్రతఁ గూరుచుండినన్. 55

## —: చుట్ట, పొడుము :—

చుట్టపిచ్చి యధికముగఁ గల కొందఱు పురుషులు తాము త్రాగు చుట్ట తమ పని తల నోటి కందించి త్రాగుమనియుఁ మఱికొందఱు క్రొత్తచుట్ట ముట్టించియిచ్చి త్రాగుమనియు వారెంతగ నయిష్టముగనఁబడినను మానక బలవంతపఱచుచుందురు. తమ కది ముదావహము గాన నట్లొనరింపఁగోరి యొప్పించి యలవఱచి తమ నోటికంపుచేఁ దమ భార్యల కింపు తొలఁగకుండున ట్లాచరించుట కలదు. ఇట్టివారి కుటుంబ మెల్లఁ బొగాకు దాసులగుట కెంతమాత్రము సంశయము లేదు. ఈపొగా కాయురారోగ్యైశ్వర్యక్షయకారకమైనను బాముకాటువలెఁ దోడనే కన్పట్టక పురుగూఁదినవారికిఁ గాలవ్యాప్తిచే దేహమెల్లఁ జెడునట్లు నిదానముగఁ జెఱుపు కలిగించుటచే జనసామాన్య మీవిషయము తెలిసికొనఁజాలకున్నారు. పెక్కండ్రు నీపొగాకు దాసులగ మాఱుచుండుటచే లోకమున కంత గర్హ్యముగఁ దోఁచుచుండలేదు. ప్రభుత్వమువా రీసంగతు లన్నియుఁ గనిపెట్టియే పాఠశాలలం జదువు విద్యార్థుల నిందుకు విముఖులఁ గావించుట విధియని విద్యాశాఖాధికారుల కెల్లరకును దెల్పియున్నారు. ఆరంభమున విలాసముగా నలవడిన యిది తుదకు దుర్వ్యసనమైన జీవితాంతము స్వసేవాపరాయణులై యుండునట్లు నిర్బంధించుచున్నది. పెక్కండ్రు తామిట్టి దురభ్యాస మొనరించుకొంటిమని నిందించుకొనుటయుం గలదు. మించినదానికి వగచిన ఫలము లేదు. విచారించినకొలఁది దుర్వ్యసనము లన్నిటిలోఁ బొగాకు మేటియని చెప్పిన సరియగును. ఇంత నష్టికరమైనదైనను దీనికిఁ గల వశీకరణశక్తి మఱియే దుర్వ్యసనములకును లేదని లోకవ్యాప్తివలన విదితమగును. ఈపొగాకుదాసులలో నిజము చెప్పువారు బాల్యమున నాటబాటగ దీని నలవఱచితిమనియు ననంతరము వదలఁజాలక బాధపడుచున్నామనియుఁ జెప్పికొనెదరు. కాని యిది మంచిదనికాని లోకమువారెల్లరు నవలంబించు టుచితమనికాని చెప్ప సాహసించువా రిప్పటివఱకును లేరు. మఱియొక చిత్రము—దురభ్యాసములుగలవా రవియెల్లఁ జాటుగను మితముగను గాలోచితముగను నిర్వర్తించుకొనుచుందురుకాని యీపొగాకుమాత్రము వెల్లడిగ నలువురిలో స్థలనియమముగాని కాలనియమముగాని లేక సేవించుచుందురు. షడ్రసోపేతముగ రుచికరములగు పరిమళమిళితపదార్థము లాహారించిన వెంటనే చుట్టకంపు లేకుండ నిలువఁజాలరు.

ఈవింత నాలింపుఁడు—మానవజాతికి విరేచనపదనును కడు నసహ్యముగ నుండునని యెల్లరు నెఱిఁగిన యంశమేకదా! అట్టిశుద్ధమునను దనను సేవించుచుండినంగాని యీపొగాకు కార్యసిద్ధి నొనఁగూర్పదు. పశువులు మలమూత్రవిసర్జనముగావించునపుడు మేఁత మేయుట నీరుద్రావుట తలంపునకువచ్చునట్లు వీరు వర్తించుచుందురు. ఈదుర్వ్యసనములుగలవా రెల్లరును దమ ధనమును మానమును బలమును వంశగౌరవమును గోలుపోవుట సామాన్యముగ మన మెఱిఁగిన విషయమే. ఆతురతతో దీని నోట ముక్కునఁ గొట్టుకొనుచుఁ జూచినవారి నెల్లఁ జేయిచాఁచి

యాచించుచు నిట్టి యలవాటులేనివా రుందురనికాని తమ్ముఁ గాంచి లోకు లసహ్యపడుదురనికాని తెలిసికొనఁజాలనంత వెఱ్ఱిగ నుందువా రనేకులు గలరు. ముత్తెఱఁగుల జను లహర్నిశము సర్వావస్థలయందును దీని సేవ యొనరించుచుందురు. ఈ చెప్పినయంశములెల్ల నాకర్ణించిన ధూమపత్రసేవకు లనేకు లిది దూషణముగఁ దలంచకమానరుకాని యిం దనృత మెంతమాత్రము లేదు.

జగ:- ఇంతసేపు నొక చుట్టగాల్చెడివారిసంగతినే చెప్పుచుంటివి. పొడుముపీల్చెడివారి విషయముకూడఁ గొంచెము చెప్పు. అది యెంత రోఁతపని కాదనుకొందును.

కృష్ణ:- దానిసంగతి చెప్పెదను వినుఁడు. రోఁతకల దైనదియుఁ గానిదియుఁ దెలియఁ గలదు. ఎంతచిన్నవిషయముం గూర్చియుఁ బూర్తిగా విచారించకున్న నది సమగ్రముగ నెఱుఁగుట దుస్తరము. పొడుము పీల్చువా రది యోగ్యమైనపనిగాఁ దలంచి చుట్టద్రాగెడువారిని నిందించుట మిగుల విచారకరము. వారి స్థితి చుట్టత్రాగెడు వారికంటెను నోట నమలెడువారికంటెను రోఁతగ నుండును. వీరి ముక్కులకు ఘ్రాణించు శక్తి తగ్గిపోవున దటులుండ వస్త్రాదికములు మఱకపడి కంపునింపుచుండును. చుట్ట గాల్చువారు భోజనానంతరము వఱకు నిదానించఁగలరు. కాని పొడుముపీల్చెడువారి లోఁ గొందఱు భోజనమధ్యమున సహితము పెడఁదిరిగి యెడమచేతనైనఁ బీల్చకుండ నిలువఁజాలరు. వారి కితరసౌరభ్యము తెలియదు. కొందఱికిఁ బొడుముతోఁ గలసిన చీమిడిబొట్లు భోజనము చేయునపుడు పడుటయుం గలదు. కొందఱు ముక్కు తుడిచి కాలికి రాచుకొనెదరు. మఱికొందఱు జేబురుమాలు లుంచి వాని నద్దబాలల పాత్తి గుడ్డలకంటె నధికమలినముగఁ జేసి చొక్కాసంచులలో దోఁపుచుందురు. ఎన్నని చెప్పను? చెప్పినకొలఁది నాయొడలు గఱిపొడుచుచున్నది. వీరిలోఁ గొందఱు ముక్కులోపలికిఁ బీల్చి కాండ్రించి యుమ్మివైచినపుడు డాపొడుచీమిడి వైచినపుడు డా పొడుము చీమిడితోఁ గలసిన తడిముద్దగ నోటినుండియు పడుచుండును. అలవాటైన వెనుక విడువఁజాలక యిన్నిపాట్లు పడుచు విచారముతో జీవయాత్ర సాగించుచుందురు.

జగ:- ఇంత యసహ్యమగు నీదురభ్యాసము వా రెట్లు చేసికొందురని యడిగితిని. ఆమాటకు నీవు నా కేమియు సమాధానము చెప్పలేదు.

కృష్ణ:- ఆవిషయమై ప్రత్యుత్తరమిచ్చుటలో మీప్రశ్న మఱచి మనసునం దంకురించిన యుత్సాహావేశముచే మరలఁ జెప్పినయంశమునే చెప్పుచుంటిని. నాభియు నల్లమందు నలవాటులేనివారు తినినఁ జచ్చుటగాని మత్తుకలిగి పడియుండుటకాని కలుగును. వానివలనఁ గొన్నిరోగములు తొలఁగిపోవునని కొంద ఱలవఱచికొని దినదినము దినుచుందురు. అటులనే నస్యమును బలువిధముల బాధపడి యలవఱచుకొనెదరు. బాల్యమునందే మొదలిడుదురుకావున భావికాలమున నీయభ్యాసముచేతఁ దమకుఁ గలుగఁగల కష్టనష్టములను వీ రెంతమాత్రము యోజింపఁజాలకుందురు. ప్రథమము నస్యము ముక్కువద్దకు వచ్చినమాత్రమునఁ దుమ్ముచుందురు. ఆఘ్రాణించినపుడు ముక్కులు

మండియుఁ గన్నులెఱ్ఱబడి నీరుగ్రమ్మియు బాధించును. ఇట్లు కొన్నిరోజులైన వెనుక సహించి మరలమరలఁ బీల్చుచుండుటచే నలవాటగును. చదువుకొనునాఁడు నిద్రాభంగము గావించుకొనఁదలంచి కొంచెముగ వాడుచు వచ్చినందున నీదురభ్యాస మయ్యెనని కొందఱును బొడుముపీల్చువారి సహవాసముచే నలవడెనని కొందఱును సాకులు చెప్పుచుందురు. పొడుము పీల్చుటచే శిరమునం దుష్ణ మధికమగును. కన్నులు తఱుచు మండుచు నీరుగ్రమ్ముచుండును. అకాలమునన చత్వార మంకురించును. అసహ్యకరముగఁ బొడుముకలసిన చీమిడి గొంతులోనికి దిగుచుండును. మెదడు చెడును. కంఠస్వరము మాఱును. సర్వకాలముఁ బడిసెముభారముచే నోట నూపిరి విడువవలసి వచ్చును. ఇల్లు నొల్లు వస్త్రములుఁ బొడుము కంపు వేయుచుండును. ఉతికి యాఱవైచినప్పుడును వారి వలువల కంపు నశించదు. ఈయలవాటుగలవారి చెంతఁగూర్చుండినప్పుడు కష్టమనిపించుచున్నను మర్యాదకు వెఱచియు మైత్రిఁ దలఁచియు నితరులు సహించుచుందురు. ఈయభ్యాసముగలవారి కెంతయవసరమగు పనియున్నప్పుడు నది వదలి ముష్టిముక్కులని చెప్పుచుఁ జిటికయని యొదను చేయి చాఁచి యాచినవారినెల్లఁ బీడించుదురు. పొడుముమూలముగాఁ బొలము చెడఁగొట్టుకొనిన కాఁపుకథ నేనీపాత్రమ్మునఁ జదివియుంటిని.

పల్లెవీడు గ్రామమున వీరప్పయను కాఁపొకఁ డుండెను. అతఁడు మిగుల మంచివాఁడు. పెద్దలయందు భక్తివిశ్వాసములు గలిగి దైవము నాత్మయందు సేవించుచుఁ బొలముపనుల నెఱవేర్చుకొనుచుఁ గాఁపురము చేయుచుండెను. అయ్యంభట్లను విప్రుఁ డాయూరఁ బురాణముచెప్పుచుండును. తఱుచుగ నీపురాణశ్రవణము రాత్రులం దగుచుండుటచేఁ దనకుఁ దీరికగల రోజులలో వీరప్పయును నచటికరిగి వినుచుండువాఁడు. పగలెల్ల మిగులశరీరాయాసకరములగు పను లొనరించువాఁడగుటచేఁ దఱుచుగ నచట నిద్రాపీడితుఁ డగుచువచ్చెను. అయ్యంభట్లయం దితనికి గురుభావము కలిగి తన చేనునఁ బండిన కాయగూర లక్కఱదినములందును బండుగలప్పుడును వారియింటికిఁ దెచ్చి సమర్పించుచుండెను. అందువలన వీరప్పయం దయ్యంభట్లకు దయ కుదిరి యప్పుడప్పు డితఁడు వచ్చువఱకును బురాణ మారంభించక వేచియుండెడువాఁడు. పురాణారంభముతో వీరప్పకుఁ గునికిపాట్లారంభమగుచుండుట గాంచి నస్యమిడి నిద్రాభంగము గావించుటయు మంచి కథాభాగములవట్టున ద్విరుక్తిగాఁ జెప్పుచుండుటయుఁ గలుగుచుండును. మొదటమొదట నస్యప్రయోగము వీరప్పకుఁ గొంతవఱకు నిద్రాభంగము కావించుచుండెను గాని కాలక్రమమున నది యలవడి కునికిపాట్లు తప్పినవి కావు. నిద్రావేశపరవశుఁ డగుచుండినను బురాణము ముగియువఱకు నచటనే యుండి యనంతర మింటికరుగుట వీరప్ప కలవాటుపడెను. అయ్యూరం బొడుమువేసికొనువారు పదుండ్రు కలరుకాని యెవరికివలసినప్పుడు వారు స్వయముగఁ జేసికొనుటయే కాని నస్యము విక్రయించువారుకాని నిలుచువారు కాని లేకుండిరి. పొడుము చేసికొనుటకుఁ దీరకుండుటచేతను దనచేతఁగాకపోవుటచేతను వీరప్ప యీపొడు మలవాటుగల పదుగురతో స్నేహముగ నుండి యక్కఱగలిగినప్పుడెల్ల వారినడిగి పీల్చి కాలము గడపుచుండెను. ఒకనాఁ డాషాఢమాసమునఁ బునాసల కడ

నుగా నూరికాఁపు లెల్ల నొకరికంటె నొకరు ముందుగఁ బొలములం జల్లఁ గోటేరులు గన్ని వృషభగళంబుల ఘంటాలంకరణం బొనరించి మిగుల నుత్సాహముతో నరుగు చుండిరి.

విత్తనాలపూటల నెత్తిపిడిగొని ఈదపెట్టువారిం గేకలువెట్టువారును ఘంటానాదముచే బెదరిపాఱు నెద్దుల సిగమోరలం బట్టి గద్దించువారును మిగుల నాతురతతోఁ గాల్యకృత్యముల ముగించి పొల మరుగువారును నై యూరెల్ల నుత్సాహపూరితంబై యలరారుచుండెను. నాఁటిదిన మీసందడిలో వీరప్ప నస్యయాచన మఱచి నలువురితో బయలువెడలి కోటేరువెనుక నడచుచుండెను. ఇతని పొల మింటికి కరక్రోసుదూరము. సగముదూర మరిగినవెనుక నితనికి నస్యధ్యాస యంకురించెను. నడవఁ గాళ్ళాడక వెనుక ముందు చుట్టుపక్కలం బరికించెనుగాని యెవరు నగుపడరు. తా నరుగునది మందటి యూరు డొంకగాన నెవరేని పాంథు లరుదెంచుచుండిరాయని ప్రక్కనున్న చెట్టెక్కి చూచెను. ఒక దరుదెంచు జాడ యగుపడెను. కొంత మనస్స్థిమితత్వము కలిగెను. విత్తు తరుణము మిగులునను చింత కలిగినను నతనికిఁ బొడుముపిచ్చి యాస్థాన మాక్రమించెను. అప్పటికి అతఁ డతివేగముగ నుండిన యితని గమనము మందగించెను కనఁబడిన బాటసారిని సమీపించెను. వీరప్ప యాబాటసారినడుము పరీక్షించి గొండిని గాయ దోఁపి యుండుటం గాంచి ప్రాణములు లేచివచ్చినంతగ సంతసించి వేగమున సమీపించి బ్రాహ్మణుఁ డగుట తెలిసి దండమిడి కడువేగమున నడచుచుండిన యామార్గస్థుని గుశలప్రశ్నాదికముతోఁ గొంతవడి వెంబడించెను. కృతపరిచయుఁడై చనవుగావించి తన కొక చిటికెఁడు పొడు మనుగ్రహింపుమని ప్రార్థించెను. ఆబాపఁడు నివ్వెరపడి తనకడ నున్నది పొడుముకాయ కాదనియుఁ దనకు నస్య మనవశ్యమనియు వైద్యముకొఱకుఁ బొరుగూరుపోవుచుంటిననియుఁ దన గొండియున్నది మందుబరణియనియుం ననినతోడనే వీరప్ప నిర్విణ్ణుఁడు నిశ్చేష్టుఁడు నై నిలఁబడెను. అప్పటికిఁ బగలు 12 గంటలాయెను. బాటసారు లెవరు లేరు. తోడికాఁపుల విత్తనములపని పూర్తికావచ్చెను. ఈకాఁపు విత్తనములపంచి మార్గమధ్యమునఁ బడిపోఁ గోటేరుతోనున్న వృషభము లితరులచేఁ దఱుమఁబడి యింటికిఁ జేరుటచే నుక్కిరిబిక్కిరై యేమి చేయుటకుఁ దోఁచక ఖిన్నుఁడై యన్నియు సరిచేసికొను నప్పటికి 3 గంటలైనందున మఱునాఁడు విత్తులు విత్తవచ్చునని తోడిరయితులు చేయుం హేళనలకుఁ దలయొగ్గి యింటికిఁ జేరి సహపాఠులవద్ద నస్యము యాచించి కుతిదీర్చుకొనెను. నాఁటిరాత్రి మఱునాఁడు మూఁడవనాఁడుకూడ విత్తుటకు వీలుకానంతగ వర్షము కురిసినందున వీరప్పపని తోడివారికి నింటఁ బెండ్లముబిడ్డలకుఁ బరిహాసపాత్రమయ్యెను. తోడిరయితుబిడ్డల పైరులు మొలకెత్తునాఁటి కితఁడు విత్తుటకు వీలుపడియెను.

వెంక:- చాల వింతగ నున్నది. ఎంతకథ చెప్పితివమ్మా ?

జగ:- ఏమోయనుకొన్నాను. పొడు మింతదా ? పాపము వీరప్పపని పాడాయెనే !

కృష్ణ:- దుర్వ్యసనము లింకను జాలఁగలవు. చెప్పుచుండినఁ జాలసేపు పట్టును. ప్రొద్దు క్రుంకవచ్చినది. ఇంకొకతడవ చెప్పెదను.

## —♦ శంకరునకు మండనమిశ్రునకు నడచిన ప్రశ్నోత్తరములు. ♦—

తరువాతఁ దద్గురువర్యుఁడు దిగ్విజయార్థియై దక్షిణదిశం బట్టి పోయి ప్రయాగపురంబున నీశ్వరనిరాస గురుద్రోహరూప పాపంబులకుఁ బ్రాయశ్చిత్తముగాఁ దుషాగ్ని ప్రవిష్టుఁడైన భట్టపాదు సందర్శించి మదీయభాష్యమునకు వార్తికము రచింపవలసి యున్నది కావున నీ వీయగ్నిప్రవేశమునుండి విరమింపుమని వాక్రుచ్చినను నాయన యభిమతింపక నా శిష్యుఁడగు మండనమిశ్రుఁడు కర్మబ్రహ్మవాదమున నాకన్న మిన్నయై యున్నవాఁడుగాన నాతని జయించి నీభాష్యముపై వార్తికము వ్రాయింపుమని స్వరూపసందర్శనము నభిలషించుటయుఁ దత్త్వోపదేశ మొనరించి యయ్యార్యు వీడ్కొని యాకాశగమనంబున మాహిష్మతీపురికిఁ దిగి బావికి నీళ్ళకు వెళ్ళు మండనమిశ్రు దాసీస్త్రీల మండనమిశ్రు మందిర మెక్కడనని మందలించెను. అయ్యంగనలు యద్గృహద్వారమునఁ జిలుకలును శ్రుతులు స్వతఃప్రమాణములా పరతఃప్రమాణములా యని భాషించుచుండునో తద్గృహము తత్పండితునిదిగా నెఱుంగుమని బదులుచెప్పిరి. సకలవిద్యాపారంగతురాలగు నుభయభారతి పరిచారికల కింతటి తెలివితేట లుండుట వింత కాదు. అంత నయ్యతిచంద్రుఁడు తద్దినంబునఁ దద్దినంబగుటంగాఁబోలుఁ దత్పండితాఖండలు బహిర్ద్వారము కవాటబద్ధమగుట గగనమార్గంబున లోపలఁ బ్రవేశించుటయు నిరువురకును గొంతవడి ప్రశ్నోత్తరములు నడచెను. పండితప్రకాండులును బరస్పర జిగీషువులును నగు వారి ప్రశ్నోత్తరములే శ్రోతలకు హర్షాశ్చర్యములు కలుగఁజేయునవి. మీఁదుమిక్కిలి ఛందోబద్ధముగ విద్యారణ్యముఖనిస్సృతములు కాన వాని నీక్రిందఁ బొందుపఱచుచున్నవాఁడను.

శ్లో. కుతో ముం? డ్యాగళా న్ముండీ. పంథా స్తే పృచ్ఛ్యతే మయా.
కి మాహా పంథా? స్త్వన్మాతా ముండే త్యాహ. తథైవ హి.

పితృదినంబగుట నిమంత్రితులై వచ్చియున్న వ్యాసజైమినుల కర్చింపనున్న సమయమున నాకస్మికముగా నాకాశమునుండి యంగణమునం దుట్టిపడిన శంకరుఁ గని ప్రప్రథమము మండనపండితుఁడు కుతో ముండీ యని ప్రశ్నించెను. ముండీ=సన్న్యాసి, కుతః=ఎక్కడనుండి యని యందలి శబ్దార్థము. సన్న్యాసి యెచటినుండి వచ్చెనని యభిప్రాయము. దీనికి సర్వశాస్త్రవేత్తయగు శంకరాచార్యు లెక్కడనుండి ముండనము గలవాఁడని యర్థము చేసి తదభిప్రేతప్రశ్నమునకు విరుద్ధముగా 'నాగళాన్ముండీ' యని ప్రతివచించెను. ఆగళాత్=గళపర్యంతము, ముండీ=ముండనముగలవాఁడని శబ్దార్థము. ముండనమన క్షౌరము. కంఠపర్యంతమే క్షౌరము చేయించుకొంటినని యభిప్రాయము. అంతఁ దనప్రశ్న తెలిసికొనలేక యట్లు బదులుచెప్పెనని మండనుండు 'పంథాస్తే పృచ్ఛ్యతే మయా' యని మరల వచించెను. మయా=నాచేత, తే=నీయొక్క, పంథాః=మార్గము, పృచ్ఛ్యతే=అడుగఁబడుచున్నదని యిందలి శబ్దార్థము. నీ వెందుండి వచ్చితివని మార్గము నడిగితినని యభిప్రాయము. యతివర్యుఁడు ప్రతిపక్షియై వచ్చినవాఁడు కనుక దీనికిని విపరీతార్థమునే కల్పించి 'కిమాహ పంథా' యని తానే మగుడ నడిగెను. మార్గః= మార్గము, కిమాహ=ఏమనెనని యేతచ్ఛబ్దార్థము. నీచేత మార్గ

మడుగఁబడెఁగదా! అది యేమన్నదని యభిప్రాయము. మండనమిశ్రుఁ డప్పుడు కోపముదెచ్చుకొని 'త్వన్మాతా ముండేత్యాహ' యని వాకుృచ్చెను. నీయమ్మ ముండ యని పల్కెనని దీనియర్థము. శంకరుఁడు దానికి, తథైవహి యని బదులుచెప్పెను. నీతల్లి ముండయే యగుఁగాకయని దీనిభావము. ఇదియే యభిప్రాయము శంకరుఁడు

శ్లో. పంథానం త్వ మపృచ్ఛ, స్త్వాం పంథాః ప్రత్యాహ మండన!
త్వన్మాతేత్యత్ర శబ్దోయం న మాం బ్రూయా దపృచ్ఛకమ్.

అని స్పష్టపఱచెను. మండనా! మార్గమును నీవడిగితివి, మార్గము నీకు బదులు చెప్పెను. నీయమ్మయనియుండిన యిందలి యాశబ్దము పృచ్ఛకుఁడఁగాని నన్నుంగూర్చి చెప్పదని యభిప్రాయము. తరువాతిప్రశ్నోత్తరము లీక్రిందివిధముగా నడచెను.

శ్లో. అహో! పీతా కిము సురా? నైవ శ్వేతా యత స్స్మర.
కిం త్వం జానాసి తద్వర్ణ? మహం వర్ణం భవా న్రసమ్.

(అహో! ఓముండీ! సురా=కల్లు, పీతాకిము?=త్రాగఁబడెనాయేమియని ప్రశ్న. కల్లుత్రాగితివాయని యిట్లు ప్రశ్నించుటయుఁ ద్రాగఁబడెనాయను నర్థమునఁ బ్రయోగింపఁబడిన పీతాశబ్దమునకు యతివరుఁడు పచ్చనిదియను నర్థమును గల్పించి యతః=ఏకారణమువలన, శ్వేతా=తెల్లనిదో యాకారణమువలన, నైవ=పచ్చనిది కాదు. స్మర=జ్ఞప్తికిఁదెచ్చుకొనుము. కల్లు తెల్లనిదన్న సంగతి యెఱింగియుఁ బచ్చనిదాయని యడిగెదవేమి? ఒకమాఱు జ్ఞాపకముచేసికొనుమని యభిప్రాయము. అటుపై మండనుఁడు త్వం=నీవు, తద్వర్ణం=దానిరంగును, జానాసికిం?=ఎఱుఁగుదువేమియని మరలఁబ్రశ్నించెను. అందులకు భగవత్పాదులు, అహం=నేను, వర్ణం=రంగును, భవాన్=నీవు, రసం=రసమును, అని బదులు పలికెను. పదంపడి పండితమండనుఁడు

శ్లో. మత్తో జాతః కళంజాశీ విపరీతాని భాషతే (కళంజాశీ=కళంజభక్షకుఁడవగు నీవు, మత్తః=మదించినవాఁడవు, జాతః=అయినవాఁడవై, విపరీతాని=విరుద్ధవాక్యములు, భాషతే=పలుకుచున్నావు) అని వాకొనెను. దానికిఁ బ్రత్యుత్తరముగా శంకరుఁడు

శ్లో. సత్యంబ్రవీతి పితృవత్ త్వత్తో జాతః కళంజభుక్ (త్వత్తః=నీవలన, జాతః=పుట్టిన, కళంజభుక్=కళంజభక్షకుఁడు, పితృవత్=తండ్రివలె, బ్రవీతి=విపరీతములుపలుకుచున్నాఁడు. సత్యం=నిజము) అని వక్కాణించెను. ఇందఱ మదించినవాఁ డనునర్థమునఁ బ్రయుక్తమగు మత్తశబ్దమునకు విసర్గలతోఁ గలిపి నావలన నను నర్థముఁ జేసి నావలనఁ బుట్టిన కళంజభక్షకుఁడు విపరీతములు పలుకుచున్నాఁ డనుమండనవాక్యమున కుత్తరముగా నీవలనంబుట్టిన కళంజభోక్త తండ్రివైన నీవలెనే విపరీతభాషణ చేయుచున్నాఁడు, అది నిశ్చయమని యాయనవైపునకే యద్దానిం ద్రిప్పివైచెను. మండనపండితుని తరువాతియుక్తి

శ్లో. కంథాం వహసి దుర్బుద్ధే గర్దభేనాపి దుర్వహాం.
శిఖాయజ్ఞోపవీతాభ్యాం కస్తే భారో భవిష్యతి?

(హేదుర్బుద్ధే = దుర్బుద్ధిగల యోసన్యాసీ! గర్దభేనాపి = గాడిదచేతఁగూడ, దుర్వహాం=మోయశక్యముగాని, కంథాం=బొంతను, వహసి=మోయుచున్నావు, శిఖా

యజ్ఞోపవీతాభ్యాం=జుట్టుజందెములచే, కో భారః=ఏమిబరువు?) అని. గాడిదకూడ మోయఁజాలని పెద్ద బొంత మోయుచున్న నీకు శిఖాయజ్ఞోపవీతము లేమిబరువైనవని తీసివేసితివని సన్యాసాశ్రమమందుఁ దనకుఁ గలిగియున్న యసమ్మతిని స్పష్టపఱచెను. ఇట్లాక్షేపింపఁబడి శంకరుఁడు

శ్లో. కంథాం వహామి దుర్బుద్ధే! తవ పిత్రాపి దుర్భరామ్
శిఖాయజ్ఞోపవీతాభ్యాం శ్రుతే ర్భారో భవిష్యతి.

స్త్రీలచేఁ దిరస్కరింపఁబడి క్రమ్మఱ వారిమీఁదనే ప్రేమపడు నీతండ్రిచేతఁ గూడ భరింపశక్యముగాని కంథను శిఖాయజ్ఞోపవీతములు తీసివేసి నేను వహించు చున్నాను. గాడిదకూడ మోయఁజాలని బొంతయని మందనువాక్యము. నీతండ్రి చేతఁగూడ భరింపశక్యముగాని బొంతనని శంకరువాక్యము. ఆగాడిద నీతండ్రియే యని యభిప్రాయము. పరీక్ష్య లోకాన్ కర్మచితాన్ బ్రాహ్మణో నిర్వేద మాయాత్ (బ్రాహ్మణుండు కర్మకులగు లోకులఁ బరీక్షించి చింతింపవలయును.) యదహరేవ విరజేత్ తదహరేవ ప్రవ్రజేత్ (అట్లు చింతించి యేదినమున విరక్తుఁడగునో యాదినమ సన్యసింపవలయును) బ్రహ్మచర్యాద్వా గృహాద్వా వనాద్వా సన్యస్య శ్రవణంకుర్యాత్ (బ్రహ్మచర్యాశ్రమమునుండికాని గృహస్థాశ్రమమునుండికాని వానప్రస్థాశ్రమమునుండి కాని సన్యసించి వేదాంతశ్రవణము చేయవలెను.) నకర్మణా నప్రజయా ధనేన త్యాగే నైకే అమృతత్వ మానశుః (కర్మచేతను సంతానముచేతను దానముచేతను మోక్షమును బొందరు) అథ పరివ్రాడ్వివర్ణవాసా ముండోఽపరిగ్రహః (అటుగాక సన్యాసి కాషా యవసనములు గట్టి జుట్టు గొరిగించుకొని భిక్షదప్ప నెవరివలన నేమియుఁ బరిగ్రహింపక యుండునది.) ఇట్టివిధుల బోధించు శ్రుతులకు భారమగునుగావునఁ దచ్ఛిఖాయజ్ఞోప వీతము లవశ్యము పరిహరింపఁదగినవి. అందువలనఁ దద్భారమోక్షమునకుఁగాఁ గంథ వహించు నా సుబుద్ధి దెలియనేరక యాక్షేపించు నీవే దుర్బుద్ధివి కాని నేను గానని యింత విరివియైన యుత్తరమొసంగుటయు మండనుండు

శ్లో. త్యక్త్వా పాణిగృహీతీం స్వాం మశక్త్యా పరిరక్షణే
శిష్యపుస్తకభారేచ్ఛో ర్వ్యాఖ్యాతా బ్రహ్మనిష్ఠతా.

(పోషింపలేక పెండ్లమును వదలిపెట్టి శిష్యులయొుఁ బుస్తకములయు భారము నిచ్చగించు నీబ్రహ్మనిష్ఠ వెలిఁగినట్టే యున్నదిలె) మ్మని మరల నధిక్షేపించెను. అంత నయ్యతిపతి

శ్లో. గురుశుశ్రూషణాలస్యా త్సమావర్త్య గురోఃకులాత్
స్త్రియశ్శుశ్రూషమాణస్య వ్యాఖ్యాతా కర్మనిష్ఠతా.

(గురుశుశ్రూషచేయఁజాలక యింటికిఁ దిరిగివచ్చి స్త్రీలకు శుశ్రూషచేయు నీకర్మ నిష్ఠయే వెలుఁగుచున్న) దని ప్రత్యధిక్షేపింప మరల మండనుఁడు

శ్లో. స్థితోసి యోషితాం గర్భే. తాభిరేవ వివర్ధితః
అహో కృతఘ్నతా మూర్ఖ! కథం తాఏవ నిందసి?

(స్త్రీగర్భమునఁ బడితివి. వారిచేతనే వర్ధిలఁజేయఁబడితివి. అరరే కృతఘ్నుత! మూర్ఖ! వారినే యెట్లు దూషించెదవు?) అని నుడువుటయుం భగవానుఁడు

శ్లో. యాసాం స్తన్యం త్వయా పీతం యాసాం జాతోఽసి యోనితః
తాసు మూర్ఖతమ! స్త్రీషు పశువ ద్రమసే కథమ్?

(ఎవరి స్తన్యము నీచేఁ గుడువఁబడియెనో యెవరి యోనినుండి పుట్టితివో పశువువలె నెంతయు మూఢుఁడవై వారియం దెట్లు రమించుచుంటివి) వని స్రుతిచెప్పెను. మగల మండనుని ముఖమునుండి శ్లో. వీరహా త్యా మవాప్నోతి వహ్ని నుద్వాస్య యత్నతః (ప్రయత్నపూర్వకముగా గార్హపత్యాహవనీయ దక్షిణాగ్నుల నుద్వాసన చేసి "వీరహా వా దేవానాం యోఽగ్నిముద్వాసయతే" (ఎవఁడు దేవతాసంబంధములగు నగ్నుల నుద్వాసనచేయుచున్నాఁడో వాఁడు వీరహత్యచేసినవాఁ డగుచున్నాఁ) డను శ్రుతిసిద్ధమగు వీరహత్యను బొందుచున్నా) వని వచ్చిన యాక్షేపణకు శ్లో. ఆత్మహత్యా మవాప్త స్త్వ మవిదిత్వా పరంపదం (నీవు పరమాత్మ నెఱుంగక "అసన్నేవ స భవతి, అసద్బ్రహ్మేతి వేదచేత్" బ్రహ్మము లేదని తెలిసికొనెనేని వాఁడు లేనివాఁడ యగుచున్నాఁడు)

శ్లో. అన్యథా సంత మాత్మానం యోఽన్యథా ప్రతిపద్యతే
కిం తేన నకృతం పాపం చోరే ణాత్మాపహారిణా?

(ఎవఁ డొకరీతినున్న యాత్మ నొకరీతి నెఱుంగుచున్నాఁడో యాత్మాపహారియగు చోరుఁడు నగు వానిచే నేపాపము చేయఁబడదు?) ఈమొదలగు శ్రుతులవలనఁ బ్రతిపాదింపఁబడు నాత్మహత్యను బొందుచున్నాఁడవు) అని పరిహరించెను. మండనమిశ్రుఁ డట్లు శంకరవాక్చాతుర్యమునఁ గట్టువడి పైయుక్తి తోఁపక తుదకు, శ్లో. ద్వారికా నపహాయిత్వా కథం స్తేనవ దాగతః? (ద్వారపాలకులఁ గనుబ్రామి దొంగవలె నిచటి కెట్లు వచ్చితివి) అని మోటుమాటలకు దిగుటయు, శ్లో. భిక్షుభ్యోన్న మదత్వా త్వం స్తేనవ ద్భోక్ష్యసే కథం (భిక్షువుల కన్నము పెట్టక దొంగవలె నీవెట్లు కుడుచుచుంటివి) అని శంకరుఁ డుగూడ ధార్ష్ట్యము నవలంబించెను. ఇట్లు ప్రత్యుత్తరములచే బరాభవింపఁబడి పైనఁ బలుకనేరక, శ్లో. కర్మకాలే నసంభాష్య అహం మూర్ఖేణ సంప్రతి (ఈ కర్మకాలమందిపుడు మూర్ఖునితో భాషింపఁదగను) అని మౌనముఁబూన యత్నించుచు భగవానుఁడు, శ్లో. అహో! ప్రకటితం జ్ఞానం యతిభంగేన భాషిణా (అహో! యతిభంగముతో భాషించు నీజ్ఞానము బయటఁ బడినది) అని తచ్ఛ్లోకమునఁ దప్పుఁబట్టెను. సంభాష్య అహంమని యాశ్లోకమున విసంధి. సంభాష్యాహమనిగాని యట నిర్దుష్టము గాదు. అప్పుడు విసంధి యగుటయే గాక పాదాంతమునఁ బదము విఱిగిపోవమిని యతిభంగముగూడ నగును. అంతఁ గ్రిందఁబడినను నాయుద్దే గెలిచె నన్నరీతి శ్లో. యతిభంగే ప్రవృత్తస్య యతిభంగో నదోషభాక్ (యతిభంగమునఁ బ్రవర్తించునాకుఁ దత్సూచకమగు యతిభంగము దోషభాజి కానేరదు) అని మండనుఁడు సమర్థించెను.

౧ మెదక్ కిషన్ రావు దేశముఖుగారు, నల్లపల్లి.

౨ వావిళ్ళ వెంకటేశ్వరశాస్త్రిగారు, చెన్నపట్టణము.

౩ తిప్పరాజు కామేశ్వరరావుగారు, కరణము, దుగ్గిరాల.

౪ తిరుమలనల్లాన్ చక్రవర్తి వరదాచార్యుల అయ్యవార్లంగారు,
శాతాపురము.

౫ రాయచూరి బందేరావుగారు, అయినాపురము.

౬ రాజా మంత్రిప్రెగడ రాఘవరావుగారు - లింగగిరి.

౭ చిక్కరాజు మట్టపల్లిరావుగారు - చెలకుర్తి.

౮ నాదరగుల్ సంగమేశ్వరరావు దే॥ గారు శ్రీశ్రీ జగద్గురు
పుష్పగిరి సంస్థానపు ఏజంటు.

౯ అద్దంకి ... తిరువేంగడతాత దేశికాచార్యులయ్యవార్లంగారు.
త్రిక్కోళ్ళపాడు.

౧౦ మియ్యాపురం రామకృష్ణారావుగారు, కొల్లాపురం.

౧౧ మల్లాది నరసింహమూర్తిగారు, ప్లీడరు, గురజాల.

౧౨ కురికాల వెంకటేశ్వరరావు దేశముఖుగారు, పులిగెళ్ళ.

౧౩ రాజా మంత్రిప్రగడ వెంకటహనుమంతరావుగారు, లింగగిరి.

౧౪ జింకా వెంకటసుబ్బారావుగారు, వకీలు, గురజాల.

౧౫ వద్దిరాజు సత్యనారాయణరావు దేశపాండ్యాగారు, మేడిపల్లి.

౧౬ గొట్టిపర్తి సుబ్బారావుగారు, వకీలు, సింగరేణికాలరీసు.

౧౭ మారేపల్లి వెంకటకిషన్ రావు, మాధవరావు దేశముఖుగార్లు
కాకర్లపల్లి.

౧౮ దంటు లక్ష్మీనరసింహముగారు - సుద్దపల్లి.

౧౯ మద్దూరి సాంబయ్యగారు - పొగాకుకంపెని - పరుచూరు.

౨౦ ముద్దు చంద్రయ్య, మారేపల్లి మారుతిరావు దేశముఖుగార్లు
కొత్తపల్లి.

౨౧ పెసర వెంకటరెడ్డి దేశముఖుగారు, ఎల్లారెడ్డిపల్లె.

౨౨ గడ్డం వెంకటనరసింహారెడ్డి దేశముఖుగారు, చెఱుకుపల్లి.

౨౩ చావలి అవధానులుగారు,
బట్టలఫ్యాక్టరీ మేనేజరు, సికిందరాబాదు.

౨౪ మల్లెల శ్రీరామమూర్తిగారు, బెజవాడ

# అభినవసరస్వతి

సంపాదకుడు—నాగరఖండస్వర్ణకారవ్యవహారాది బహుగ్రంథకర్తయగు
జానపాటి పట్టాభిరామశాస్త్రి.

ఇది రెండుమాసపత్రిక. ఇందు వర్ణాశ్రమధర్మబోధక గ్రంథములును విమర్శనము లును వ్యాసములును ప్రకటింపబడును. చందా సం॥ 1 కి రు 3-0-0

ఈ కార్యస్థానమున వెలకు దొరకు పుస్తకములు.

| | | | | |
|---|---|---|---|---|
| 1 విరూపాక్షపీఠగురుపరంపర | ... | 0 | 2 | 0 |
| 2 నీతిగీతలు (సుమతిశతకము, దానిశ్లోకములు) | ... | 0 | 2 | 0 |
| 3 వాసంతికాపరిణయ నాటకము | ... | 0 | 4 | 0 |
| 4 కరణీకోద్ధారిణి [ప్రాచీనప్రబంధము] | ... | 0 | 4 | 0 |
| 5 విశ్వబ్రాహ్మణశబ్దఖండనము, బ్రాహ్మణశబ్దవిచారము | | 0 | 2 | 0 |
| 6 విగ్రహారాధన ఖండనఖండనము | ... | 0 | 4 | 0 |
| 7 స్వర్ణకారవ్యవహారము | ... | 1 | 8 | 0 |
| 8 శుద్ధాంధ్రహరిశ్చంద్ర చరిత్రము | ... | 0 | 10 | 0 |
| 9 జాతిసంహిత (ఆంధ్రము) | ... | 2 | 0 | 0 |
| 10 భారతీయప్రబోధము (పిడుపాటి చిదంబరశాస్త్రి) | | 0 | 4 | 0 |
| 11 ధర్మనిర్ణయము | ... | 0 | 4 | 0 |
| 12 అస్పృశ్యతానివారణఖండనము(తల్లాదిరామకృష్ణచయనులుగారు) | | 0 | 8 | 0 |
| 13 స్కాందమహాపురాణాంతర్గత నాగరఖండము (౧ సంపుటము) | | 1 | 0 | 0 |
| 14 డిటో నాగరఖండము (౨ సంపుటము) | | 1 | 8 | 0 |
| 15 డిటో నాగరఖండము (౩ సంపుటము) | | 1 | 8 | 0 |
| 16 డిటో నాగరఖండము (౪ సంపుటము) | | 1 | 8 | 0 |
| 17 కల్హాటివీరచరిత్ర | | 0 | 12 | 0 |
| 18 భాగవతరహస్యములు | | 0 | 4 | 0 |
| 19 హాటకేశ్వరశతకము | | 0 | 2 | 0 |
| 20 జాతకచర్య (స్వకీయులచరిత్ర) | | 1 | 8 | 0 |
| 21 మధూకాంబరీవిడంబనము | | 0 | 4 | 0 |

అభినవసరస్వతీ కార్యస్థానము, జానపాడు, పిడుగురాళ్లపోస్టు,
గుంటూరు జిల్లా.